# కథలు

## సంపుటి.2



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001.

**BAPU CARTOONS VOL. 2**

---

ప్రచురణ నెం. : 2342

కాపీలు : 1000

ప్రథమ ముద్రణ : 15 సెప్టెంబర్, 2002.



వెల : రూ. 130/-

విదేశాల్లో వెల : $ 13

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
అబిడ్స్, హైదరాబాద్ - 500 001.
E-mail : visalaandhraph@yahoo.com

విశాలాంధ్ర బుక్ హౌస్ (అబిడ్స్ & సుల్తాన్ బజార్) హైదరాబాద్, హనుమకొండ, అనంతపురం, తిరుపతి, విశాఖపట్నం, కాకినాడ, విజయవాడ, గుంటూరు & ప్రముఖ పుస్తక విక్రేతలు.



---

Printed at Kalanjali Graphics, Hyd.

ఇలాంటి పుస్తకం ప్రపంచ కార్మిక చరిత్రలో

ఎక్కడా రాలేదన్న నిజాన్ని ఒప్పుకున్న ధైర్యశాలి

మహోత్తమ కళాభిమాని వంటుగూ అయిన

**శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ**

అసలు ఫ్రెండ్స్‌ని మరచి పోయావు చూసావా అని గుర్తుచేసిన

సర్వశ్రీ **డా॥ విజయమోహన రెడ్డి**

**బ్నిం, కళాధర్ లు** గారలకు

కృతజ్ఞతా పూర్వకంగా, ఉమ్మడిగా

ఈ సంపుటి అంకితం చేస్తున్నాను



# గీతప్రమాణ సాక్షిగా...

అంతా నిజమే రాస్తాను. అబద్ధం రాయను. కాలేజీల్లో చదివే ఆడపిల్లల వెంటపడే కుర్రకారు "బామ్మ" అంటూ వాళ్లనేడిపించటమూ, చివుక్కున వెనక్కి తిరిగిన పిల్ల బారెడు జడనూ వెనక్కివిసరి బుసబుసలు పోవటమూ, "సారీ మా ఉద్దేశం అదికాదు బాపూ గీసిన బొమ్మ - అదే బామ్మ" అని మెచ్చుకోలు సంజాయిషీ ఇవ్వడమూ, అది విన్న బారెడుజళ్ళ పిల్లలు ముప్పైమూడొంకరలు తిరగడమూ చూసే అదృష్టం 20వ శతాబ్దం 5వ దశకంలో చాలా మందికి పట్టింది.

ఆ రోజుల్లో ప్రసిద్ధ వారపత్రికల్లోని కథలకు ఇలస్ట్రేషన్స్ బాపు వేస్తుండేవారు. బారెడు జడా, గింగిరాలతో గాలికి చెదిరిన ముంగురులతో, కోల ముఖమూ, సున్న చుట్టిన మూతీ, వయ్యారాలు పోయే సన్నపాటి శరీరమూ - ఇదీ స్థూలంగా బాపు ఆడబొమ్మతీరు. చిదిమి దీపం పెట్టేలా ఉండే వాటి సౌరు.

బాపు రేఖ పండిన తీరు ఓ నిరంతర యజ్ఞఫలం. బొమ్మ చూడగానే గీతనుబట్టి గీతాకారుని పసిగట్టగలం. గీచినగీతలు చెప్పేవ్యాఖ్యానాలను మించి, బాపు దాచిన గీతలు చేసే భాష్యాలే ఎక్కువన్నది అందరికీ తెలిసిందే! బాపూ బొమ్మలకు సరళత, స్పష్టత, వాస్తవికత, జాతీయత, క్లుప్తత - అన్నవి పంచప్రాణాలు.

బాపు చిత్రరేఖా విన్యాసాలు కడుపుబ్బనవ్వించడమే కాదు, కళ్ళు చెమర్చేలా కూడా చేస్తాయి. వేలు పెట్టిన ప్రతిరంగంలోనూ తన ముద్రను స్థిరీకరించిన సర్వతోముఖ ప్రజ్ఞాశీలి బాపు. సత్తిరాజు లక్ష్మీనారాయణగా తల్లిదండ్రులకు మాత్రమే తెలిసుండచ్చు కానీ, చిత్రకళ - సినిమా - కార్టూన్ వగైరా వగైరా రంగాలలో బాపుగా తెలియని వారుండరు. చదివిన 'లా' ఒక్కింతయు అంది రాక, జన్మత: అలవడిన గీతలే బాపు గీతను మార్చాయి. ఆ గీతలు ధనం కూర్చిపెట్టాయా లేదా అనంటే తెలుగుదనం మాత్రం సమకూర్చిపెట్టాయన్నది ఆయన గీత చూస్తే తెలుస్తుంది. బాపు అన్నపేరు పెట్టుకోటానికి ప్రేరణ ఏంటో తెలిస్తే బావుణ్ణు ! గీతకు సైదోడైన రాతకు (రమణగారికి) తెలుసేమో అడగాలి. సందర్భాన్ని బట్టి గీతల శైలిని మార్చే లక్షణం బాపూది. ఇవన్నీ ఈ కార్టూన్ కావ్యమాలికలో మనం చూడగలం.

తమ 70వ జన్మదిన (15 డిసెంబర్, 2002) సందర్భంగా కొన్ని కార్టూన్‌లను ఓ సంకలనంగా ప్రచురించే అవకాశం విశాలాంధ్ర ప్రచురణాలయానికి కల్గించినందుకు బాపుగారికి శుభాకాంక్షలూ, కృతజ్ఞతలూ తెలియజేసుకుంటున్నాం. గీతాభాష్యకారుడు ముళ్ళపూడి వెంకటరమణగారు ఓ చక్కని పీఠికలాంటి 'బాపు నుంచి [illegible] నుంచి [illegible] దాకా' రాసినందుకు ధన్యవాదాలు.

**ఇక గీతారహస్యం మీ చేతిలో ఉంది. గోఅన్.**

ఏటుకూరి ప్రసాద్, సంపాదకుడు.
విశాలాంధ్ర ప్రచురణాలయం.

# బాపు నుంచి [illegible] నుంచి [illegible] దాకా

— ముళ్లపూడి వెంకటరమణ

"వత్సా ! వరం కోరుకో"

"ఎందుకూ ? "

"బి.ఎల్ చదివి లాయరు వయ్యావు గదా "

"అయితే ? "

"ప్రాక్టీసు పెట్టాలి గదా "

"పెడితే ?"

"గొప్పలాయరువై కోట్లు గడిస్తావా - గొప్ప జడ్జీవై కీర్తి గడిస్తావా - వరం కోరుకో"

"నా ప్రాక్టీసు అదికాదు"

"మరి లా యెందుకు చదివినట్టు ? "

"తండ్రి ఆజ్ఞ తలదాలిచి"

"ప్రాక్టీసు పెట్టకపోతే తండ్రి ఆజ్ఞ తప్పినట్టు కాదా ?"

"తండ్రి ఆజ్ఞ లాయరు చదవడం వరకే - ప్రాక్టీసుకు ఇది వర్తించదు"

"ఇంతకీ ఏం ప్రాక్టీసు చేస్తావు ?"

'ఇదీ' అని అట్టమీద వేసిన సరస్వతి బొమ్మని చూపించాడు బాపు.

చదువుల తల్లి సంతోషించింది.

"అరె - నాతో మాట్లాడుతూనే నా బొమ్మ గీశావే "

"నాతో మాట్లాడుతూనే నువ్వు వీణ వాయిస్తున్నావు కదా "

"చమత్కారివే - సరేకాని - బొమ్మలు అని ఒక్క మాటలో చెప్పావు. చిత్రకళ సముద్రమంతటిది. అందులో ఎన్ని విధాలున్నాయో - ఆయిల్ పెయింట్స్, వాటర్ కలర్స్, పెన్ & బ్రష్, వాష్ పెయింటింగ్స్‌లో రవివర్మ, చామకూర్, దామెర్ల, భాగీరథి, మొక్కపాటి, పిలకా, వైకుంఠం, పైడిరాజు - ఇలా ఎందరో... రేఖా చిత్రాల్లో బాపిరాజు, తలిసెట్టి, వ పా - తెల్లదొరల్లో డావిన్సీ, మైకేలేంజలో, నార్మన్ రాక్వెల్, హోగార్త్ - కార్టూనుల్లో షూల్జ్, కెచామ్ - శిల్పంలో రోడాన్ (RODIN) రాయ్ చౌధురి - ఇలా ఎన్నో శాఖలు - ఎందరో మహానుభావులు...

"వారందరూ నా గురువులే - అందరికీ వందనాలు."

"కాని ఈ శాఖలలో నీకేది కావాలో చెప్పు - ఒక్కొక్క శాఖలో సాధన చేసి సాధించడానికి ఒక జీవిత కాలం చాలదు - నీకే శాఖ కావాలో చెప్పు". .

"నాకు అన్నీ కావాలి"

"అదేమిటి - దురాశ - అది సాధ్యం కాదు- ఏదో ఒకటి చెప్పు - వరమిస్తాను"

"వచ్చినప్పటి నుంచి వరమిస్తానని బెదిరిస్తున్నావు - నాకు అసలు వరాలే వద్దు."

"అదేం ?"

"అతి చవగ్గా వచ్చేవీ - శ్రమలేకుండా జేవార్సుగా వచ్చేవీ మంచివి కావని మా నాన్న గారు చెప్పారు. ఏదైనా కష్టపడి సంపాదిస్తేనే రుచి"



"సరే కానీ - షడ్రుచీ ప్రాప్తిరస్తు"

"ఇది వరమా ?"

"కాదులే - అలవాటు కొద్దీ వచ్చేసింది - ఇది నా కోరిక - నా ఊహ"

★ ★ ★

ఇది 'నా' ఊహా చిత్రం....

అయితే బాపు "బొమ్మల కథ" సరీగా ఇలాగే జరిగింది - జరుగుతోంది.

అయినా ఇప్పటికీ బాపు కృషి చేస్తూనే ఉన్నాడు - ఉంటాడు.

"నాకు బొమ్మలు వెయ్యడం రాదు - అవకాశాలు లేక ఆర్టు స్కూలుకెళ్ళి శిక్షణ పొందలేదు" అని ఇప్పటికీ అనుకుంటూనే ఉంటాడు - అంటూనే ఉంటాడు.

సాధారణంగా కళారంగంలో ఒక శాఖలో కృషిచేసి సాధించినవారు జీవితాంతం ఆ ఒక్క శాఖలోనే కృషి చేస్తారు. ప్రసిద్ధులవుతారు. కార్టూన్‌లు వేసేవారు కార్టూన్‌లే - పెయింటింగ్స్ వేసేవారు అందులోనే...

కాని ఒక్క బాపు మాత్రం రేఖా చిత్రాలు, వర్ణ చిత్రాలు, తెలుగు వెలుగు రూప చిత్రాలు, కారికేచర్స్, దేవతల చిత్రాలు, సినిమా పబ్లిసిటీ, కమర్షియల్ పబ్లిసిటీ- ఇలా అన్ని శాఖలలోనూ కృషి చేశాడు. వేదవేదాంత గ్రంథాలకు ముఖచిత్రాలు వేశాడు. కార్టూన్‌లలో మళ్ళీ - సినిమా, రాజకీయం, ప్రకటనలు, కామిక్‌స్ట్రిప్, హాస్యరేఖా చిత్రాలు - మళ్ళీ మాటాడితే

చలనచిత్రాలు, సంచలన చిత్రాలు, (బాపూ మార్కు ఫ్లాపులు) అనేక రకాలు వేశాడు. అనితరసాధ్యం అనిపించే సర్వతోముఖ ప్రావీణ్యత సాధించినవాడు బాపు - బాపే - బాపు ఒక్కడే.

శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు చెప్పినట్లు "బాపు రేక పండినది".

పండు అంటే -

దోర ముగ్గిన మామిడి పండు దోసిట్లో వచ్చిపడటం కాదు. వరప్రసాదం కాదు- ఒక విత్తనం మొలకెత్తడం - వేరు భూమిలోకీ, ఆకు ఆకాశంలోకీ - జొరబారడం; ఎగబాకటం... చైత్రం నుండి చైత్రం వరకూ - ఎండా వానా, ఉక్కా చలీ, ఆకలీ అజీర్ణం, నిద్రా అలసటా, పురుగూ పుట్రా - అన్నిటినీ అనుభవించుతూ ఒంట పట్టించుకుని నిభాయించుకోవడం... క్రమంగా సక్రమంగా నిదానంగా ఎదగడం - ఆకు తొడగడం, చిగురు వేయడం పూత పూయడం కాయ కాయటం పండు పండడం...

బాపు రేక పండిన తీరు ఇంత తీరుబాటుగా ఇంత నెమ్మదిగా సక్రమంగా సహజంగా నిసర్గసుందరంగా భాసించింది... నాలుగైదేళ్ళ అల్లరివేళ్ళతో - బొగ్గు పట్టుకుని - నాన్న చేతిలో చుట్ట, అమ్మ దగ్గర కుంపటీ చీపురుకట్టా, నర్సాపురం వెళ్ళే రైలు పొగా (నర్సాపురం వెళ్ళేది రైలా ? పొగా ?) చీకట్లో రైలూ వేసిన చిన్న చేతులే పలకా బలపంతో సుద్దముక్కతో పెన్సిలుతో పెన్నుతో బ్రష్షుతో బొమ్మలు వేశాయి. ఒకట్లూ పదులూ వందలూ కాదు - వేలకొద్దీ - వేలకి వేలకొద్దీ !

బొమ్మలు నేర్చుకునేవారిలో - కన్నూ ముక్కూ నోరు - చాలా మందికి సులువుగానే వస్తాయి. కాని కాళ్ళూ వేళ్ళూ కష్టం అంటారు. బస్టాండులో స్కూలు ప్లేగ్రౌండులో కిళ్ళీ బడ్డీ దగ్గరా ట్రాములో బస్సులో బీచిలో గుడిలో కోనేరులో... కొనే తినే చిల్లర లెక్కెట్టే వేళ్ళూ - నడిచే పరిగెత్తే ఆగే దూకే ఎక్కే కాళ్ళూ వేళ్ళూ - వేలకి వేళ్ళు... ఇవన్నీ చెట్టుకి వేళ్ళలా పునాదిలోకి చొచ్చుకుపోయాయి, అల్లుకు పోయాయి... అవే పైకి కొమ్మలై రెమ్మలై ఆకులై పూతలై పిందెలై దోరకాయలై ఆరముగ్గిన పళ్ళుగా పండాయి.

**40 లలో మొలకలెత్తిన బొమ్మలు 50 లలో లేత మొక్కలై 60 లలో 70, 80, 90 లలో క్రమ వికాసం పొందాయి.**

సుమారుగా ప్రతి పదేళ్ళకీ ఒక రేఖా హేమంతం, ఒక నవరేఖా చైత్రం... పాత గీత జారిపోయి కొత్త గీత పోసుకోవడం... ప్రకృతి కాంత వలువలు మార్చుకున్నట్లే...

★ ★ ★

ఇద్దరు నదివద్ద నించున్నారు.

" ఇది నది" అన్నాడు ఒకడు.

"ఏది నది? నువ్వు చెప్పినపుడు కనిపించిన నీరా - రెప్పపాటులో వెళ్ళిపోయినదా- ఇపుడు వస్తున్నదా-మరో క్షణం తరువాత రాబోయే జలబిందువులా - ఏది నది ?" అన్నాడు మిత్రుడు.

అవును - ఏదీ - ఏ ఒక్కటీ కాదు - నిన్నా నేడూ రేపూ కలిసే ప్రవాహమే నది.

బాపు బొమ్మలు రేఖలు, వెలుగులు నీడలు, వంపులు సొంపులు అన్నీ నదిలాంటివే.. ఇది ఇది అనే సరికి - ఆ 'యిది' 'అది' అయిపోతుంది. మరొక 'అది' వస్తుంది. కొత్త రేఖలు, కొత్త శైలి... బాపుని అభిమానించి యిష్టపడి అనుకరించే చాలా మంది ఆర్టిస్టులకు నిత్యపరివర్తన శీలమైన బాపుశైలి దొరకదు - 'ఇది' అని వారు వేసిన కొద్ది కాలానికే అది మారిపోతుంది.

సర్వసాధారణంగా ఆర్టిస్టులు అందరికీ - నూటికి 99 పాళ్ళు - ఒకటే శైలి వుంటుంది. కార్టూన్‌కు ప్రసిద్ధులైన ఆర్.కె. లక్ష్మణ్, ఆబూ, మారియో - వీళ్ళందరి రేఖలూ ఎప్పుడూ ఒక్కలాగే ఉంటాయి. రేఖలే కాదు సంతకాలు కూడా అలాగే ఉంటాయి. కాని బాపు బొమ్మలు - అందులో వెలుగు నీడలూ వాటి వంపు సొంపులూ- ఇవేకాదు - సంతకం కూడా మారుతూనే ఉంటుంది. ఈ 'బాపు' సంతకం పరిణామశీలమై మారుతూ 'బాపు' అనే ఆడంబరం నుంచి ఎన్నో మార్పులు చెంది - 'బాపు' అనే దిగంబరం - సింప్లెస్ట్ సంతకం చేరుకోవడానికి 55 సంవత్సరాలు పట్టింది. బాపు బొమ్మలను విశేషంగా అభిమానించే ఆరాధకులకు 50ల నాటి బొమ్మలలో ఎక్కువ గీతలనుంచి 90 ల నాటి తక్కువ గీతల బొమ్మల వరకూ అనేక స్థాయిలలో మార్పులు కనిపిస్తాయి. ఒక పరిపక్వత ఒక పరిణత స్థితి ఎలా రూపుదిద్దుకుందో కనిపిస్తుంది. గొప్ప కళాకారులు ఎప్పుడూ క్రమవికాసంతో సింప్లిసిటీ కోసమే ప్రయత్నిస్తారు. గాయకులు కొత్తలో విజృంభించే అనవసర స్వర విన్యాసాలనూ, రచయితలు వాగాడంబర విన్యాసాలనూ, చిత్రకారులు రేఖా వికారాలనూ క్రమంగా తగ్గించుకుంటూ - చివరకు ఒక స్వచ్ఛ సుందరమైన నిరాడంబరమైన స్థాయిని సాధిస్తారు. అదే కళకు తురీయావస్థ - పరాకాష్ఠ...

బాపు నుంచి బాపు వరకు జరిగిన జరుగుతున్న జరగబోతున్న కథ అదే...

ఎందుకిన్ని మార్పులు - ఎందుకిన్ని రకాలూ ? అంటే "వై నాట్ ? " అంటాడు

బాపు. అసలు నిజానికి ఈ సృష్టిలో మార్పు లేకుండా జరిగేది మార్పు జరుగుతూ వుండడమే అంటాడు.

మనం ఒక్కొక్క సంగతి చెప్పడానికి ఒక్కొక్క భాష ఒక్కొక్క స్వరం ఒక్కొక్క అభినయ వైఖరీ వాడుతున్నాం. సరదా సంగతికి ఒక ధోరణి, దుఃఖానికి మరొక రకం, కోపానికి ఇంకో విధం... అలాగే సంగీతంలో సాహిత్య భావాన్ని బట్టీ గానం చేసే సమయ సందర్భాలను బట్టీ రాగాలూ స్వర ప్రస్తారాలూ మారుతాయి.

అలాగే రకరకాల పరిస్థితులను ప్రతిబింబించే చిత్రాలు మాత్రం ఎందుకు మారకూడదు! అంతేకాదు - చిత్రకారులలో మన దేశంలో, మన రాష్ట్రంలో, ఈ నగరంలో - ఇతర దేశాలలో ఎందరో చిత్రకారులు, మహానుభావులున్నారు. వారందరూ నా గురువులే -- అందరి దగ్గరా నేను ఎన్నో నేర్చుకున్నాను. నేర్చుకుంటూనే వున్నాను. నేను ఒకో ఆర్టిస్టు బొమ్మ చూస్తూంటే ఆయనలా వేయాలనిపిస్తుంది. అలాటి 'ఆయనలు' నాకు శతకోటి ఉండబట్టి నేను ఏ శైలికీ కట్టుబడలేను. ఏ శైలీ నాకు కట్టుబడి ఉండదు' అంటాడు.

నా శైలే ఏమిటి - నేనే రోజు రోజుకీ, క్షణక్షణానికీ మారిపోతున్నాను గదా ! అడుగున్నర బేబీ నుంచి అయిదున్నర అడుగుల బాపు దాకా పెరిగాను. పెద్ద పాముపడగ లాటి 'హెడ్డు



మీద - హుడ్డు' అలా అలా వెనక్కెళ్లి బాల్డు హెడ్డు వచ్చింది. కోల్మన్ టైలర్ మీసాలు పోయి నిర్మీసం అయింది.

బహుదూరదర్శన్ మరియు అతిసూక్ష్మదర్శన్ కళ్లకి కళ్లజోడు వచ్చింది. రానిదల్లా బొమ్మలలో సామర్థ్యమే - అంటాడు వినయం ఉట్టిపడే గర్వంతో.

ఇందులో చిన్న ధర్మసూక్ష్మం ఉంది. డిగ్రీ చేతికి రాగానే చదువు అయిపోయింది

అనుకుంటారు చాలా మంది. అసలు చదువుకి అదే మొదలు అని బాపు నమ్మకం. మనకి ఎంత విద్యరాదో, ఎంత నేర్చుకోవాలో తెలియజెప్పి హెచ్చరించేదే డిగ్రీ అనే సిగ్నల్ అంటాడు. డిగ్రీ రావడమే విద్యకి ఆరంభం... కొత్తగా రెక్కలు వచ్చిన పక్షిలా - ఇపుడే అసలు విద్య నేర్చుకోవడం అని నమ్ముతాడు బాపు. విద్యకి ఆరంభం ఉండవచ్చుగాని అంతం అనేది ఎక్కడా ఎప్పుడూ ఉండదు అంటాడు. నేను చిన్నపుడు ఏ ఆర్టు స్కూలులోనూ శిక్షణ పొందలేదు. అందువల్ల నా విద్య సమగ్రం కాదు. అయివుంటే ఈ చిత్రాలు ఇంకా బాగా ఉండేవేమో అంటాడు బాధగా.



అది- అనగా ఈ ఆర్టు స్కూలు విద్య లేకపోవడం శాపమో అభిమానుల పాలిటి వరమో మనమే తేల్చుకోవాలి...

★ ★ ★

సాధారణంగా పెయింటర్స్ పెయింటింగ్‌లోనే ఉంటారు. రేఖా చిత్రకారులూ కార్టూన్ కళాకారులూ వారివారి ప్రత్యేక ప్రపంచాలలోనే వుండి ప్రసిద్ధులవుతూ ఉంటారు.

అన్ని ద్వారాలూ తెరిచి అన్ని లోకాలలోనూ విహరించి అన్నిరకాల చిత్రాలనూ వేసీ - వేస్తూ చలనచిత్రాలను తీస్తూ ప్రసిద్ధులయిన ఒకరిద్దరిలో బాపు ఇద్దరి పెట్టు...

రామ చిత్రాలూ భామ చిత్రాలూ బంతిపూల రథాల వంటి 'బొమ్మ' చిత్రాలూ, ఫోటోగ్రాఫ్‌ను మించి పై సంగతి వేసే తెలుగు వెలుగుల వంటి రూపు రేఖా విలాస చిత్రాలూ సినిమా పోస్టర్లూ ఇవన్నీకాక - అంతకి అంత తులతూగే కార్టూన్‌లు వేల కొద్దీ వేశాడు. కింద కాప్షన్ వల్లకాక - కేవలం బొమ్మచూస్తే నవ్వు వచ్చేవే నూటికి 90 పాళ్ళు. అరహాసం నుంచి అట్టహాసందాకా రకరకాల నవ్వుల పువ్వులు పూయించే చిత్రాలవి... దుర్వాసుడినీ విశ్వామిత్రుడినీ భమిడిపాటి కామేశ్వరరావునీ, విశ్వనాథ సత్యనారాయణనీ, తాపీ ధర్మారావునీ (ఈయన నవ్వినా బవిరి గడ్డం వల్ల నవ్వు కనబడదు) దేవదాసునీ, ఇస్పేటాసునీ కూడా నవ్విస్తాయి ఆ కార్టూనులు అని మీకు తెలుసు నాకు తెలుసు. తెలుసునని ఇద్దరికీ తెలుసు

అయినా చెప్పుకొనుట - విశ్వనాథ వారన్నట్లు ఇది యొక చమత్కారము. అన్నిటినీ మించిన ధనం - అన్నిటిలో ఉట్టిపడే తెలుగుతనం...



బొమ్మల్లో బామ్మగారినో, పిన్నిగారినో రాధాగోపాళాన్నో అల్లరి వెధవనో - రోడ్డు సైడు రోమియోనో అద్భుతం అని నేను మెచ్చుకోబోతే - ఏం కాదులే - అది దొరల కార్టూన్‌కు పచ్చికాపీ అని మొట్టికాయ వేస్తాడు. కాపీ అయితేనేం - వాడి దొరతనాన్ని ఇస్త్రీ చేసి మన తెలుగు దీపాన్ని వెలిగించావు కదా. ఇప్పుడిది అచ్చ తెలుగు కార్టూన్ కన్న అచ్చ తెలుగున్నర కార్టూన్‌లా ఉంది అని నేను వాదిస్తాను. అతను రేడియో వాల్యూమ్ పెంచుతాడు.

ఓ సారి ఎవరో ఆర్టిస్టు - బాపుగారి అప్పడాల కఱ్ఱ మార్కు కార్టూన్‌లకు రోజులు చెల్లిపోయాయి అని విశాల హృదయంతో జోహార్లు అర్పించాడు. వెంటనే బాపు - గయ్యాళి ఇల్లాలి చేతిలో 'శివ' మార్కు సైకిలు చెయిను ఏర్పాటు చేసి విమర్శకుడిని సత్కరించాడు.

ఎదుటి వాళ్ళమీద జోకులూ కార్టూన్‌లూ అందరూ వేస్తారు - కాని తనమీద తన చిత్రకళమీద కూడా కఠినాతి కఠినమైన క్రూరాతి క్రూరమైన జోకులు వేసుకుని తన గురివింద గింజత్వాన్ని తనే ప్రకటించి హాయిగా నవ్వుకోవడం ఒక్క బాపుకే చెల్లింది.



అందాల రాముడు మాకు మార్కెట్లో మస్కా ఇచ్చి, మేమంతా దుఃఖసముద్రంలో విలాసంగా ఈతలు కొడుతున్నవేళ - బాపు కార్టూన్‌లు వేసి - పత్రికలో ప్రకటనలుగా (!) అచ్చు వేయించాడు. తీసిన వారికీ చూసిన వారికీ కూడా అంచనాలు 'తలకిందులు' చేసిన చిత్రం అంటూ పడవను తలకిందులుగా వేశాడు. అలాగే 70వ రోజు అని ఒక పోస్టరు - యాడ ? అని చుట్టకాల్చే ప్రేక్షకుడు

అడుగుతాడు. యాడా లేదు ఈడా లేదు రిలీజయి 70 రోజులయిందని అంతే - ఆడుతోందని కాదు అని వ్యాఖ్య రాశాడు.

ఇదే కాదు - తాను తీసిన తెలుగు, తమిళ, హిందీ చిత్రాలలో మేటివీ ఓటివీ - జయాపజయాలను బట్టి అన్నిటికీ కార్టూను రూపాలిచ్చి క్విజ్ పెట్టాడు - అదొక బోనసు. ఇలా టివి మీకు ఏ కార్టూన్ బుక్‌లోనూ దొరకవు - సావధాన్...

★ ★ ★

నవ్వించే బొమ్మల మధ్య అపుడపుడు జాలితో బాధతో కలచివేసే కార్టూన్‌లు కూడా కనిపిస్తాయి.



ఒక నడి వయసు తండ్రి కుంపటి మీద వంట చేస్తుంటాడు. అమ్మేదీ అని అడిగే కొడుక్కి - " మన అమ్మా - గ్యాసు స్టవ్వున్న అంకుల్‌తో ఊరెళ్ళిపోయింది" అని చెప్తాడు.

ఒక వృద్ధుడికి మందుల సేల్స్‌మన్ యవ్వన గుళికల గురించి చెప్పి ఊరిస్తాడు. "నా పింఛనుకేమీ ఇబ్బంది రాదుకదా" అంటాడాయన ఆశా భయాల మధ్య ఊగిసలాడుతూ.

★ ★ ★

ఇవన్నీకాక కార్ట్యూన్ అనే ఒక విలక్షణమైన జాతి బొమ్మలున్నాయి. లిమరిక్కుల చమత్కారాలతో రాతాగీతా కలిపి కలబోసిన పన్నీటి జల్లులు... తెలుగు సినిమా నటీనటుల ఫుల్‌సైజు గాలరీయే ఏర్పాటు చేశాడు.

ఆపైన - నవ్వులకు బదులు మనసులో పువ్వులు పూయించే దివ్యమనోహర చిత్రరేఖా విన్యాసాలున్నాయి. అవి ఒక్క కన్ను, ఒక్క ముక్కు కొన, చెవి రింగులు, కేశపాశాలు, పాదాలు, వేళ్ళూ, గోళ్లు, శంఖం లాంటి మెడ, రంభోరువుల్లాటి తొడ, మీ గుండెల్లో దడ.

ఇవన్నీ అక్షరాలా చిత్రరేఖా కవిత్వాలు - బొమ్మ పూర్తిగా వెయ్యకుండా, ఒక కన్నూ, ఒక చూపూ - దాని చివర ప్రియుడూ - జలపాతం లాటి కురుల మీద నుంచి జారుతున్న ప్రియుడు. చెవి రింగులో కూర్చునీ, లోలాకులు పట్టుకునీ ఉయ్యాలలూగే వయ్యారి బాబులూ - ఇలా ఎన్నో రేఖా - ఖండాలు. అవి సగమే- మిగతా రూపం ఊహా చమత్కారం మన

మనసులో ఏర్పడతాయి. అన్‌హర్డ్ మెలొడీస్ ఆర్ స్వీటర్ అన్నట్లు వీటిలో బాపు గీచిన గీతలకన్న దాచిన రేఖలు మరింత మనోహరంగా ఉంటాయి. ఇలాటి చిత్రాలు ఎన్నిటినో పత్రికలలో వేస్తే వేలాది పాఠకులు వాటిని చూసి లిమరిక్కులూ చమరిక్కులూ హైకూలూ రాశారు. ఇది చిత్ర చక్షు సంయోగం అనే కెమిస్ట్రీలో అద్భుతమైన ప్రక్రియ.. సరదాగా బొమ్మలు చూస్తున్న పాఠకుల చేత సరదాన్నరగా కవితలు పాడించాడు. డాన్సులాడించాడు. బొమ్మలు చూసి పాఠకుడు నవ్వుకోవడం అనే వన్‌వే ట్రాఫిక్‌ని మల్టిపుల్ కమ్యూనికేషన్‌గా మార్చాడు...



ఇది ఒక కళాకారుడి కలాపోసన.

బాపు కార్టూన్‌లో పొల్లుగీత ఉండదు, రాతలో పొల్లు మాట ఉండదు. అంతా లెక్కే. స్పష్టంగా ఖచ్చితంగా రత్న ఖచితంగా ధగధగ మెరుస్తుంటాయి. ఆ మాటల పదును, ఆ డైలాగుల సొగసు, పొంకం - బొమ్మని మించి మాట మాటని దాటి బొమ్మ. ఇందులో మాటలు నావేనని ఒక పేద్ద అపప్రథ ఉంది. నా పేరు రచయిత కాబట్టీ, ఇద్దరం కలిసి తిరుగుతుంటాం కాబట్టీను - కొందరు తెలిసీ తెలియకా 'బాపుగారి గీత - రమణగారి రాత' కలిస్తే - అంటుంటారు.

పబ్లీకున గర్వపడి సిగ్గుపడి భలేవారే అని నటనలు చేసినా - రహస్యంగా దిగులుపడి పోతుంటాను. కావమ్మ మొగుడంటే కాబోసు అనుకున్నాననుకుంటాను.

కాని సరస్వతి తోడు - ఊహ్ గీతా రాతా సమస్తం సత్తిరాజు లక్ష్మీనారాయణ అనే బాపు గారివే. నా గొప్పదనం అల్లా అవి పత్రికలో అచ్చయి మీరంతా నవ్వేముందు - నేను అతని డెస్కు దగ్గరే చూసేసి అందరికన్న ముందుగా నవ్వేస్తాను.

అది నా అదృష్టం.

★ ★ ★

మీకు యిష్టమైన కార్టూన్‌లు ఏవి ?

ఈ బుక్కులో ఒకటో పేజీ నుండి నూరు దాకా - నూట ఒకటి నుంచి రెండొందల ఒకటి దాకా - ఆ తరవాత -

ఆ తరవాత రెండో సంపుటం వరకు -

ఏవని చెప్పను ఎన్నని చెప్పను - వందలా వేలా పదివేలా - చాలా... చాలా... ?

★ ★ ★

దిష్టిచుక్క:—

పరిచయవాక్యాలు ఎవరిచేత రాయించాలో అని తటపటాయించాను. బాబ్ హోప్ అనే హాలీవుడ్ హాస్యనటుడు రాసిన ఆత్మకథ గుర్తొచ్చింది. అతని ఆ పుస్తకం వెనకాల కవరు మీద పెద్దపెద్ద అక్షరాలతో " ప్రపంచ సాహిత్యంలో ఇంత గొప్ప గ్రంథం రాలేదు "— ఇట్లు మా అమ్మగారు అని వుంది

అందుచేత రమణ గారిచేత ఇది రాయించాను

బాపు

బాపు కార్టూన్లు - సంపుటి-2

# అపార్థ సారథి

ముళ్ళపూడి వెంకటరమణ






వచ్చిన పేపరు ఇంకోళ్ళకివ్వడు - కానీ మళ్ళీ
ఎవడికి కాదేమనుకొని పాతాడో
అని భయం!




రాత్రి షూటింగు నించి వచ్చేసరికి తెల్లారింది
పూజ - రికార్డింగూ అని ఇప్పుడే
మళ్ళీ పరిగెట్టారు - ఆగండి చూస్తా.....



ఉఱుముల కులికి పడక కిమురు పోడుముచు:
పింఛెంబులు కొంచెంబులు సేయక విప్పి
దెప్పరంబుగ రొప్పుము సేయు
నర్తనమూ కాదూ - పోదూ కాదూ -
మీరెవత్తినో మరిగారు



ఆయన పిచ్చరు
మొదటి వారం ఫ్లాటున్నారు గానీ
రెండో వారం
పికప్పయిందంటు !






మీరెళ్లింది ఏ సినిమాకో!
బుద్ధిమంతుడు!


ఈ సారైనా సరిగ్గా నొక్కేయండి -
ఇహ నవ్వను - ఇదే ఆఖరి సారి -


సిష్టర్ జ్ఞానం! బల్లేసుకోమ్మా!
యూ కెన్ యూజ్ ద టేబుల్
సిష్టర్!


కొంచెం చిన్నసైజు
ఇస్తునా!


మీ అక్కయ్య లేడీస్ క్లబ్ ప్రెసిడెంటు!
ప్రెసిడెంటుగారు వంట చేస్తే ఎవరైనా
చూస్తే
బావుంటుందా


టీవీలో బొమ్మ బానే వుందంటే
ఆయనే అదోలా కనిపిస్తున్నారు
బాపు


చిట్టినాన్న-
ఇవాళ మన నర్సు- బాండేజీ
కట్టడంలో బుల్లి మిస్టేకు చేసిందనమాట
అదేమిటో కనుక్కో చూదాం!


మా టీవీకి
కరెంటక్కర్లేదమ్మోయ్!


ఇండాకా రేడియోలో రూపాయి రేటు పడిపోయిందన్నమాట మళ్లీ గట్టిగా అనమాకే - మధురం ఉందంటే కంగారు పడిపోద్ది - వెర్రిపిల్ల!


స్కూటరిస్తేగానీ పండక్కిరానని మానాన్నగారికి రాశారుగా ఆయనే వచ్చేసినట్టున్నారు


కొత్తజోళ్లనుకుంటా_


కెకరకెయిష్టం
చేసొస్తే
సింపుల్‌గా_వద్దు_
అని చెప్పండి
బాబు


నేడే చూడండి
గ్రామసింహం
రెండోవారం కలెక్షన్లు
పికప్పయ్యాయట


నగేస్రావా! తాతయ్యా!


ఇన్నాళ్టికి నువ్వు
నవ్వగా చూశానే
బొట్టే


టీవీ వచ్చాకే నయమమ్మా! లేపోతే
అలాగే నా ఎదురుకుండా కూచుని
కళ్లప్పగించి చూస్తూండేవారు

చూశారా మినిష్టరుగారూ - మనమెప్పుడూ
దండలొద్దని మొదట్లో పోకూడదు -



సదుపయోగించాల్సిన బుర్ర నాకేం పట్టిందే-




పాపం - తేచి
నీకిచ్చారు కదే!


నన్ను చూణ్ణివ్వు నాయనా
ఏం భయం లేదు - నేను మంత్రసాన్నే
వంద పురుళ్ళు పోసా
కాస్త తప్పుకో


ఈమధ్యకాలంలో ఇంత
నాటకపిచ్చరు రాలేదన్నాడు పత్రికవాడు..


ఓందమ్మా
కలుపునావ్వా~?
క్రికెట్ టెస్టు
ఆఖరు రోజు


చీ చీ చీ - అంతా
మా వారి పోలికేనమ్మాయ్!
మా వారే!
తలకోసుకున్నారు ప్రైజ్
కిట చెక్కింది




ఈ కొత్త టీవీ ఇచ్చెయ్యండీ - మునపటి
చిన్నది - బ్లాకండ్ వైటు - అదే నయం
మంచి మంచి ప్రోగ్రాము లొచ్చేవి —


ఏమండోయ్ కళ్లజోడు


పేపరువాడు 750 కోట్లు స్వాహా అని రాశాడు
మరి మిగతా యాభయ్యో ఏంచేసేరూ ?


ఇప్పుడు 'లబ్కులబా' అనే చిత్రం నించి
ఒక బూతు గీతం వింటారు


తమరు నిన్నే చేరారు కదండీ! మర్రిపోయ అమెరికానుంచి
శర్మగారి కోసం ఎవరో వచ్చారంటే
మీ కుర్చీ ఆరి గదిలో వేశా-


ఏదో చూస్తున్నారని!
పూజ చేస్తున్నారనుకున్నా-


ఎందుకండీ నామోషీ! శుబ్బరంగా కళ్లడాక్టరుకి చూపించుకోరాదూ!


అదృష్టవంతుడివయ్యా
రేపు గురించి నీకు బెంగక్కర్లే—




ఏమండీ - ఓమాటు కిందికొస్తారా
బాబాయిగారూ పిన్నీవాళ్ళూ వచ్చారు


పరువు నష్టం దావా
వేద్దాం డాడీ!


కాము మధురం
ఒక్క పలుకు నెచ్చెలీ అన్నానే!
త్రివేణి




ఈ మధ్య వానలు పడక
ప్రాక్టీసు తప్పారుగానీ - మావారు
డాన్సు చేస్తే రెండు కళ్లూ చాలవ్!


త్వరగా స్వామీ - త్వరగా
అక్కడ
కొండ మునిగిపోతుంటే!...




బావా! జలస్తంభన విద్యచే
సుయోధనుండీ హ్రదంబున
దాగియుండునోయ్...


అచ్చు తప్పంటోయ్




స్వామీ - దేవుడొస్తే లేపండి.
రంభా ఊర్వశీ వచ్చినా సరే...
బాపు


డాక్టరు గారు టీవీ చూస్తున్నారు
రేపు రండి -
బాపు


మన విద్యా విధానం ఏ కంట్రీకీ
తీసిపోదని ఇందుమూలంగా ఏకగ్రీవంగా
తెలుపుకుంటున్నాము
గొళ్ళు


ఈ బరువు తగ్గించే మాత్రలకి
గుణమేదైనా కనబడితే
వెంటనే ఫోన్ చేసి చెప్పమన్నాడు!


రండర్రండి పిన్నిగారూ - ఏంలేదూ
పిల్లలకని జీడిపాకం పడుతున్నా-


తన మెదడుని మేధాశక్తిని అంకితంచేస్తా తీస్కోండంటూ
పొద్దున్న సైన్సు అకాడమీకి వెళ్లొచ్చారు మా బాబాయ్
ఆలోచించి కబురు చేస్తామన్నారట !


ఎరక్కడిగాను
పచ్చిగా
వుందేమిటని


ఆ ఫైళ్లన్నీ పూర్తిచేస్తేగానీ కదల్డానికి
వీల్లేదంటే 'అలాగే తయారూ' ఏంటయ్యా?
'అలాగే తయారూ' ఏంటి?


ఆస్పత్రులంటేనే బాబోయ్ మా-
రానన్నారు మా బాబాయ్
నేనే బలవంతంగా తీసుకొచ్చా-


నా మాట విని ఓ కత్తిపీట కొనుక్కరండీ!
కరెంటు బిల్లు బోల్డవటుంటే!


నాటు మామడున్నర
మీన్లలో సరిగా
సగమెంతోయ్!
WEIGHT


రుమాలు మాదేనండి
గానీ ముక్కు నాదండి.


వాన్ మినిట్ !
మొకమ్ తుడుచుకుని
వచ్చేస్తా-






అమ్మా


అమ్మోయ్


ఇంతేకొచ్చేశా!


ఏమండీ! శకునం !!




సరకు నచ్చకపోతే
సంతోషంగా
బిల్లు వాపసిస్తాం!


ఎవర్రా అక్కడ!
మొక్కలకి అంతంత
ఎరువెట్టొద్దని చెప్పాన!



వాటర్ ప్రూఫోయ్! మొన్న అమెరికానించి
పంపించాడు మా అల్లుడు!




అమ్మా! రాడనుకున్నామా!
బావొచ్చేశాడేవ్ !!


మీ యింట్లో నోములు
రేపటితో ఆఖరనుకుంటా
కుటుంబరావుగారూ
జో అచ్యుతానంద
జో జో
ముకుందా


ఏలోయ్ రాజూ!!


అన్నట్టు మీరు కేంటీనువేపెళ్ళినప్పుడు
మేనేజరుగారికోసం ఎవరో వచ్చారంటే
మీ కుర్చీ ఆరిగదిలో వేశా -


నేడే చూడండి!


అమ్మో! వెళ్ళిపోకండి!
ఆ సీను సినిమాలో లేదు!
కత్తిరించేశారు—


రెడ్డిగారిది
మోటు సరసం!


అమ్మా!
చెల్లాయి చూడంతే - మళ్ళీ ఆయన్ని
అల్లరి
పెడుతోంది


అమ్మా - చేతులు
నొప్పుడుతున్నాయన్న
వదలటంలేదే నన్నరూ!


వేడిగా వుందా?
అంత గట్టిగా వూదుకోవాలా?


సుబ్బన్నా! కిందటి పుష్కరాలకి ఇదే గోదావరి స్టేషన్లో మిమ్మల్ని చూసి ఇంకెవరో అనుకుని పలకరించానా?



ఇలా మేడమ్ రవీంద్రభారతిలో వేషం కడుతున్నారూ అని
చెప్పగానే అయ్యగారు కారుకోసమైన ఆగకుండా
వర్షంలో పరిగెట్టుకొచ్చేశారమ్మా



మా పెద్దోడికి మా తండ్రిగారి పేరు పెట్టుకున్నాం.
ఒరే రాము - వెధవా - ఓ మాటిలా రా -



# శ్రీ అబ్బూరి వారి ద్విపద బొమ్మలు



వెన్నదిని పాలు త్రాగిన
వెన్నుడవు రంగరంగ ః
మన్నుదిని చిన్నతనమున
విన్నావా! ముళ్ళపూడి వెంకటరమణా



చిన్నపెద్ద తెలియని
సన్నుతుల మాటలివి; త్రిజగతీ పితయై
ఉన్నాడు గాంధి ఒకడే
విన్నావా! ముళ్ళపూడి వెంకటరమణా!



ఉన్నాడో లేడో శ్రీ
మన్నారాయణుడు, కని మనవారికి స్టా
లిన్నే భగవంతుడంట
విన్నావా ముళ్లపూడి వెంకటరమణా



వెన్నెముక లేని కవులకు
వెన్నెరుఖను కురుల పగటి వేషాలున్ కన
సన్న వలంకారములట
విన్నావా! ముళ్లపూడి వెంకటరమణా!



పున్నమ నరక మోర్వక
కొన్నేడులుగాని ఏడుగురు కూతుళ్ళన్
కన్నతని యమ బాధను
విన్నావా! ముళ్ళపూడి వెంకటరమణా!



ఎన్నేళ్ళు పైన బడినా
అన్నుల మిన్నలను చేరనస పడని వా
రున్నారని ఎప్పుడైనా
విన్నావా! ముళ్ళపూడి వెంకటరమణా!



తన్నులు తిని ప్రహ్లాదుడు
తన్నించె నృసింహుచేత తండ్రిని, 'ఇదియే'
మన్న 'అహింస'న్నాడట
విన్నవా! ముళ్ళపూడి వెంకటరమణా!



పన్నీట జలక మాడుచు
చిన్నారి యొకర్తు చేత సిగరెట్ పీలు
స్తున్నదట మధ్యమధ్యను
విన్నవా! ముళ్ళపూడి వెంకటరమణా



పన్నులు చెల్లింపని తా
పన్నుల రక్షించుబాధ్య ప్రభువుల నోటన్
పన్నొక్కటైన నియరు ప్రజ
విన్నావా! ముళ్ళపూడి వెంకటరమణా!



సన్నం వీణకన్న
విన్నాణము కంది యనుచు బిస్మిల్లా
నన్ను వినతోదట ప్రజ
విన్నావా! ముళ్ళపూడి వెంకటరమణా!



శ్రీరంగమెక్కి కవితా
వారాంగన నాట్యభంగి విహరింపంగా
నారంగన యౌక కొందర
ధీరంగమునందు కవుల త్రొక్కుచు శ్రీశ్రీ



అతి వాస్తవికాగ్రసరు
లతులిత శబ్దప్రయోజనాతీతులు పం
డిత భారువు మరి కొందరు
మతి చెడి విహరించుచుండ్రు మహిలో! ర



నవ్వు మల్లెపూలు నవనీతము మనస్సు
కప్పురంపు పలుకు కంతుటాయకు
మూడు లోకములను ముంచుకట్ల కములకు
సాటి యెవ్వరౌట పాటులందు!



నీ వేడ్కతో కుసుమ
బాణములన్ ంచె సూర్యనా
రాయణ రాజుపై ఫు
రమ్మున మన్మథ ధూర్త్ర కృతా!
మ పున్నెమో! అఘమొ!
ఋంతయునుం జయింపలేదు బీ
ర్యయుతెగాని కొసునుల కేశవు బక్కర వానికిన్



కైతలోన మిన్న కటూరి వెంకన్న
పక్ష్మంకొంతు డతడు సూక్ష్మబుద్ధి
ఒకరి కున్న కీర్తి ఒకరికి రాబోదు
జంటకవులనెడి ప్రశస్తి తప్ప



పైసేతత్ ప్రచరించు భామినుల
భాస్వన్నంబు మంజీరకే
ళీ సాంగత్యము మాని ధూమ
శకటాలీ మాతికా హారికా
వాసం బోగతి స్వీకరించి తిరుగం
జాత్సేయు నీ దుష్కర
వ్యాసంగంబు విడుచు వచ్చు
బెజవాడా! మాకు నీ యాత్రలో!




మీవారికప్పుడే బట్టతలొచ్చేస్తోందేవ!




ఏం వచ్చేనోయ్
పెట్టరుగారు తేరా!
ఎవరో సాములొర్లొచ్చారు
దీక్షలో వున్నారట- ఈ నాల్రోలూ
మందు ముట్టుకోరట


అమెరికా అల్లుడూ-
కొస్త కారం తక్కువ
వెయ్యమని చెప్పాకదమ్మో




కపిద్ధాకారభూగోళా అన్న
చెవలాయ ఎవడోయ్ - భూమి
తెలగపిండులావుంటే ఆయొక్క
హిరణ్యాక్షుడు చాపలా ఎలా
చుట్టుకెళ్లాడుష!


మావారికి ఎనిమిది కొట్టిందంటే
ఠంచన్‌గా కంచంలో
అన్నం పడాల్సిందే




ఏమిటి తాతయ్యా
తీగ తెగేకంటా
వాయించేస్తున్నావ్!
ఇందాకట్నించి చూస్తున్నా
అదీ సంగతి! బొత్తిగా
కళ్ళు కనపట్టంలేదు సుమా!


ఏందయ్యా మరేనా
ఎక్కువంటావ్ తక్కువంటావ్
ఇహనుంచి ఉతకడమే నా వంతు
బట్టలకి గంజి నువ్వే పెట్టుకో

హవ్వ! హవ్వ! ఆ శోకేవిటే పిల్లా!
ఆ చీరేవిటే! మీ అత్తతో
చెప్పనా! చంపేస్తుంది!

ఈ చీర మా అత్తయ్యదేనండి
తెలుస్తే అంత పని
చేస్తుంది!



సారీ రాజుగారూ - మిమ్మల్ని గుర్తుపట్టలే -
పేక ముక్కల మీదగా
పేక పాలయేసరికి....




వీరన్నొచ్చి
అయ్యగారు ముండని
తెస్తున్నారని చెప్తే.....


పోన్లేస్తురూ వదిన!
సిగరెట్లు మానేశారు
అందుకు సంతోషం!



వెంకటప్పగారి భార్యనండి - ఆఫీసుటైమవుతోంది ఒకటూ ఓసారి లేవకూ
అని ఎంత లేపినా నిద్దర్లేవలేదండి-
కావస్తే నువ్వెళ్ళు అని కసిరారండి-



ఈయన మా పెద్దగుమాస్తా - వర్కులో ఇబ్బందొస్తే
ఆయన్తో చెప్పు-
ఆయన్తో ఇబ్బందొస్తే
నాతో చెప్పు -

ఎవరన్నా ఇంటికొచ్చినప్పుడు నన్ను 'అమ్మగారూ' అని పిలవండత్తయ్యా-
లేపోతే చూసేవా పెద్దదానిచేత ఇంటిపని చాకిరీ
చేయిస్తోందని నన్ను తిట్టిపోసుకుంటారు



వచ్చేస్తున్నా డాక్టరుగారూ
అబ్బాయిగారు
పేషంటు ముక్కులో
డ్రాప్స్ వేస్తున్నారు
అనగానే వచ్చేశా-




అసెంబ్లీకి ఏమయితే అవుగాక
ముందు మీరు క్షవరం చెయించుకోనిదే
కెవల్గానికి వెళ్లము


నేడే చూడండి!
హవుస్ ఫుల్
అవలేదంటే
ఎందుకవుద్దీ!
తాళాలు తేడం
మర్చిపోయావురా
ఎదవా_


అయిదేళ్లగా మీరు పంపిన
ప్రతికథ తిరిగొచ్చేస్తోందంటే
కట్టె పోస్ట్‌మాన్ గాణ్ణి
నన్నేం చెయ్యా
మంటారమ్మా!


నిన్న పండగరోజు గదాని రాత్రికి దాకా
టీవీ ముందు కూచున్నా
ఒక్కటంటే ఒక్క ప్రోగ్రాము
కూడా బాలేదంటే నమ్మండి
ఒళ్లు మండిపోయిందీ


తలుపు తీయనందాకే కాస్త ఆగలేరండీ!


నిన్నరాత్రి వారు వంటిల్లు కడుగుతూంటే జారి పడంబోయానమ్మోవ్
వారు వెనకాలుండి ఆదుకున్నారు కనగ్గానీ – చచ్చేదెబ్బ తగిలుండును


మళ్ళీ చల్లారిపోయిందంటారు కాఫీ తొరగా తీసుకోండి


పట్టాభిరాం | మెజీషియన్


ఏవిటది...
నిన్న రాను
ఇద్దరిదీ సామాజిక స్పృహేనండీ
ఎటొచ్చీ నేను బొమ్మలు వేస్తే
తను పేర్లు
పెడుతాడు


ఆ మాటున ముఖం ఇలా పెట్టి
ఇంక్రిమెంటా!
నీకా! హహ్హాహ
అన్నాడు

ఏమండీ కాస్త....

కుత కుత

ష్యూర్ డార్లింగ్

మా అత్తయ్య కొడుకు లెండి - చిన్నప్పుడు నాకిద్దామనుకున్నారు నేనొద్దన్నాననీ ఆ ఏడుపు!

తలుపుతీసి లోపలికి రండి


పిలచిన
బిగువటరా!




ఇంజెక్షనంటే అంత భయమైతే ఎలాగండీ
అయ్యా పులిరాజుగారూ
మిమ్మల్నే...ఎక్కడా?



పిల్లదానికి అమెరిక సమ్మంధం వద్దుమొర్రో అంటే విన్నావా!




నీళ్ళు వెచ్చబెట్టారేమో
తెలీదని వేలెట్టాను-
మరుగుతున్నాయి!


అమ్మగారూ- పచ్చిళ్ళివిగో
తలుపుతెరిచి కళ్ళుమూసుకోండి
లోన అయ్యగారు మడిపంచె
మరిచిపోయారంట
అదికూడా తేసుకు
రమ్మన్నారు-


మీరెన్ని చెప్పండి
టామీ లేని లోటు మీరు
తీర్చలేరు-తీర్చలేరు!


నన్నపార్థం చేసుకుంటున్నావు సుమీ!
అపార్థం చేసుకుంటున్నావు
ఆవిడ మా అమ్మ!
మా అమ్మ!!


శ్రోతలకొక హెచ్చరిక
అనివార్య కారణాల వల్ల
ముందు ప్రకటించిన విధంగా
శ్రీమతి ఆదిశక్తి గారే
ఇపుడు పాడుతారు


MOS. RAJU
అయ్యగారు
బాష తేడయ్యా మగడా
అంటే యున్నావా?


ఊఁ - ఎండయితే - ఏం?
మేమందరం మనుషులం కామా -
నీకు మాత్రం తాను కావల్సి వచ్చిందమ్మా
వెళ్లేళ్ళు - పంచాయు ముందు
MANAGER


ఇవాళ మా దినఫలం చూసుకున్నారా?
మా దుంబావు నించి చెక్కు
ఇప్పుంటి కొడుకులేరప్ప -


ఆ బల్ల సర్దించండి - ఫైళ్ళకింద
మనిషుంటే వెంటనే
డిస్మిస్ చేసెయ్యండి


ఏవండోయ్
బట్టలకి సబ్బుపొడి
చెంబాడుకన్నా
ఎక్కువెయ్యకండేం


పక్కవాటావారు స్నానం చేస్తున్నట్టున్నారు
ఈ కూరియరు సంతకం
పెట్టి తీసుకుని
కాస్త పక్కింటోళ్ళకి
ఇస్తారామ్మా-


ఒరే ధర్మరాజా
నీ ముక్క తెరచి చూట్టగానే
ఆ ఆవిడ ఇందాకట్నుంచీ
చప్పుడు చేస్తోంది-
ఆ చీర ఇచ్చిరమ్మా-


మా కోడలు కట్నం తీసుకురాకుండె వచ్చిందిగానీ
ఓ సీసాడు కిరసనాయిలిప్పిస్తారా పిన్నిగారూ-


ఆ. ఏంటేమా! పక్కింటి
తాయారమ్మగారి కోడలు తెలుసా!
కట్నం తేసుకురాకుండా
వచ్చిందట


చూడమ్మా బుజ్జికన్నలూ - వీడేమో మన మేనేజరు పీనుగ
పేరు సురుమూర్తి. అకౌంట్లు కూడికలో తప్పు చేశాడన్నమాట
ఇప్పుడు నాన్నారు ఈ సురుమూర్తిని ఎలా పాతేస్తాడో
నువుచూస్తావన్నమాట-


బిజీగా వున్నట్టున్నారు
కాసేపుండొస్తాం -


పరుగుచ్చుకోపోతే
ఆఫీసుకందుకోలేరు


చిట్టీ - ఈనే
మా మేనేజరు - ఇంటో
ఎవరూ లేరూ - పొద్దు
పోయిందీ - మీయింటోనే
కాస్త వంగిలి పడుతా
పడమంటే తీసుకొచ్చా-


నా 'రుధిర గీతాలు' ఎప్పటికప్పుడు చదవాలనే!
మొన్నయిల్లు మారినప్పుడు ఇంటావిడ
పుస్తకాలన్నీ బస్తాలోకెట్టి
అటకమీద పడేసింది!
అటకెక్కాలంటే బద్ధకం!


టీవీలో రివటం భయం
ఎగబడి కొనేయడమే!
ఏదు!


ఎప్పుడూ అనగనగా కథలేనా!
ఏవేన పాత కథలు చెప్పండి
నాన్నగారూ!


ఒరే శిష్యా! నా కృష్ణాజినం
ఏమయిందో అమ్మగార్నడుగు


కింద మెతుకులు
పడకండా తినలేరండీ


అట్లు బాగా వేడిగా వుంది
చూసుకు తినండి స్వామీ!




" సలహాలు కెలమ్ - మాలతి గారూ - మా ఆవిడ చేత
కనీసం వారానికి ఒకపూటయినా వంట చేయించే మార్గం
చెప్తారా! ఇట్లు కొ.కు." కార్డుకి డబ్బులెక్కడివీ?



ఇప్పుడా యూకుళ్లో ఇందాకా తరిగి వుంచుకున్న
ఉల్లిపాయ ముక్కలూ, అంత క్రితం దంచి
వుంచుకున్న ధనియాల ముద్ద వేసి బాగా
కలియ బెట్టండి.....



పిండి పొంగడానికి
సోడా ఓ చిటికెడేస్తే చాలమ్మాయ్-




ఇద్దరిళ్ళల్లోనూ
మొన్ననే టీవీ కొన్నాం


మీరే ఏదో అనుంటారు వాణ్ణి—


HOPE AND MORT BANK LTD.
దీనికూడా కాస్త చిల్లరిస్తారా?


అడిగితే నేనే తీసిచ్చేవాణ్ణిగదండీ!


వీరే మావారు - నువ్వెప్పుడొచ్చినా పరిచయం
చెయ్యటంలేదనీ ఆ సెటైరు


మా వారినేం పట్టించుకోకండి పిన్నీ!
ఒట్టి అల్లరి ఘటం...


మొన్నిచ్చిన యాభయ్యూ
ఏమయ్యాయ్—




ఏటిసారు లేపోరయ్ - కూచోండి
కూచోండి. రాక రాక వచ్చారు
భోంచేసి వెడుదురు గాని...

మా పుట్టింటి గురించి అంతమాటన్నా కూడా - మహాపతివ్రతను కాబట్టి నాకేమాత్రమూ కోపం రాలే సుమా! ఇలా తేలిగ్గా నవ్వేసి - పోన్లెండి - మా తాహతు అంతే - పెళ్లయి ఇన్నేళ్లయి ఇప్పుడు మీరు చెప్పాలా ఏమిటి అంటూ పులుసు రాచ్చిప్ప ఎత్తి ఆయన్నెత్తిన బోర్లించాను



మీ ఆయనొచ్చేటైముకి అలా రోజూ పూలు అవీ పెట్టుకోక్కర్లేదు పిల్లా - పస్తుకరేమ్ కి చాలు






అవును కదమ్మా
గడియారం ఆగినా-
అయిదయితే
ఎగాతతయ్యా మరి!


సరకు కస్టమరు
చేతిలో వుండగా
ధరలు చెప్పద్దని
చెప్పానా-


నువ్వొచ్చేసరికి తెలవుతుంది కద - ఓ చుక్కేసుకుందారని బాటిల్
తెరిచా - మూత కొస్తే బొరున కిందకి దొర్లి
పోయిందె - చచ్చినట్లు సినిమా మొత్తం
కిలీ చేయాల్సొచ్చింది


గంట నించి చూస్తున్నా మీకోసం - ఈ పాటికి
సినిమా మొదలెట్టేసే వుంటారు - ఉండండి
జడేసుకుని చీర మార్చుకొస్తా -

కనీసం బూట్లైనా విప్పి పడుకోండీ - దుప్పటి చిరుగుతుందీ - రైలు టైముకి నేను లేపుతానన్నాగా...



నాకు మొమ్మొదటగా స్ఫూర్తినిచ్చిన గ్రంథం - పేరుగుర్తులేదుగానీ మొదటి లైను మాత్రం 'అనగనగా' అని మొదలెడుతుంది




చాలా బావుందండీ చీర -
ఇహ చెప్పండి
ఎవత్తది!
WALHI
SILKS


మళ్ళీ ఏమొచ్చింది


జే ప్రజలు ప్రజలే రాజు అనగా
నిజముగా అదివాంయ్!


అమ్మగారండి -




మా అయ్యకి జొరంగా వుందంట
చిన్నన్నేలి పితుక్కోమన్నారండి పాలు




మొక్కలు
ఉన్నవి
జాగ్రత్త
మొక్కలు
ఉన్నవి
జాగ్రత్త
మొక్కలు
ఉన్నవి
జాగ్రత్త
మొక్కలు
ఉన్నవి
జాగ్రత్త




ఆ వార్తలయ్యేదాకా మీ తాతయ్య
రాడుగానీ – మీర్రండర్రా పిల్లలూ
భోజనానికి –


ఆ న్యూసు అరగంటయింది
మింగటానికొస్తారా–


ఏకంపోయేయ్ స్క్రీవరూ
పెట్టించి అరగంటయింది


ఓసీ! నేను రాక్షసుని చంపబోవు
చున్నాను - కూడనేయుండు -
అవసరమయినప్పుడు సాయమునకు
వెంటనే పరుగిడి రమ్ము -


అయబాబో
పిల్లలుగలవాణ్ణి
మారాజా


మరీ మంచిది
వారందరినీ కూడా
లాక్కురమ్ము!


బుడుగు
బాపు
బుడుగూ
మధుమాసం
వచ్చేసింది


ఏదీ - ఎక్కడా?


మధుమాసం!
ఆమని!!
ఏమని?




బుడుగు
బాపు




దీక్షితులూ- నువు ప్రార్థన చెయ్యటంలేదు
ఆవలిస్తున్నావు—


పైగా నిద్రపోతున్నావు దీక్షితులూ


బుడుగు
బాపు
బురుగూ విందుకు రమ్మా


వహ్వా!


ఎలా వుందేం వంట
ఓహో - రాజాలకి తగిన భోజనం


రాజా!


బుడుగు
బాపు
నేను తపస్విని


తపస్వివయితే దండంమేదీ ! కమండంమేదీ ! గడ్డమీసాంతేదీ !


ఆ బ్రహ్మతేజస్సేదీ


నేను కొత్తా తపస్విని


దేనికదే చెప్పుకోవాలి-
మా యావిడ మూడేళ్ళ క్రితమే
తేలిపోయింది.


పక్కింటివాళ్ళు కలరు టీవీ కొన్నారంటే చూడ్డానికెళ్ళి
వాళ్ళ మిషిన్లో రుబ్బిన పిండితో కుక్కర్లో
వేసిన ఇడ్డెన్లూ వాళ్ళమిక్సీలో
ఆడించిన కరప్పొడీ ఇచ్చారు
తింటే మింగుడు గాని-



కేకేస్తే నేనే వచ్చేవాణ్ణికదా-




ఆలిండియా రేడియో
వార్తలు చదువుతున్నది
నా మాట విని
రిపేరుకి
కొట్టువాళ్లకివ్వండీ!


జగపతి బాబు - ప్రేమ - సీమ నటించు
ప్రేమ త్రికోణము
FILM FESTIVAL
హీరోకి
ప్రాబ్లెం క్రైపై - ఇద్దరినీ
పెళ్లి చేసుకొనవచ్చు కదా!



కేకేస్తే నేనే కిందికి వచ్చునుకదే-




ఇచట
పళ్ళు
కట్టబడును




ఇప్పటికి కొత్త పెద్దవనిపించినా
నాల్రోజులు అలవాటయితే
అవే సర్దుకుంటాయి-
బాపు


ఈవిడ నిన్న రాత్రినుంచీ తుమ్ముతూనే వుందండి. ఆవిడ
తుమ్మడం - నేను చిరంజీవ నూరేళ్ళాయుష్షు అనడం -
ఆవిడకి నీరసం వచ్చేసిందండీ -
నాకు పీక పోయింది -
DR. PAT


ఇలా ఎప్పటికి చేరను - పోనీ
బస్సులోనేనా
వెడదామంటే


నేడే చూడండి
ఆబాల గోపాలాన్నీ నవ్వించే చిత్రరాజం


ఇంటివాడొస్తున్నట్టున్నాడు - లేనని చెప్పమన్నారు
వచ్చేది ఇంటివాడు కాదు - నరసమ్మ - మీ ఆవిడట
నేను లేనని చెప్పండి


INRI
పీటర్ బ్రూక్స్ అనుదొరగారు
మన మహాభారతం సినిమా తీశారు. అందు
కృష్ణుడు వైదుమ స్ప్రీ తేసుకుంటాడు భీముడనుకుంటా
నీగ్రో జాతివాడు! అది స్ఫూర్తినిచ్చి బైబిలు ఈ పద్ధతిలో
వుంటే ఎలాగనిపిస్తుందో తోచి వేసిన బొమ్మ.


ఇక పోజిరాదమ్ము
పంతులమ్మ
వెళ్ళిపోయింది




ఇదిగో_ ఇలా వచ్చి కాస్త
తలకి నూనెరాసి తగలడు
బాపు


మీ బుజ్జి కన్న చిత్తి మనవడింక లేవలే!
అది మా నాన్నారు - పొద్దున్నే జైలుకి దిగారు~


లేవగానే కొత్త బాసుని చూసి జడుసుకుంటాడేమో!
పోర్టుఫోలియో మార్చారని ఇప్పుడే తెలి
చెప్పేదిరోటే!


నన్ను మరిచిపో అమితాబ్!
నన్నపార్థం చేసుకోవద్దు!
ఈ మెడ నెప్పి ఇక భరించలేను


బొత్తిగా మొహం చూపడం
మానేశావేం దిలీప్!


ఉప్పు రెండోటి
ఎక్కువ పడ్డట్టుంది


ఆనాడు - నువ్వు నన్ను నిజంగా ప్రేమించి వుంటే
నా సుఖమే కోరుకుని వుంటే
ఆ ఎన్నారైగాదు
మీ మావయ్య కొడుకునే
పెళ్ళాడి వుందువు


అచ్చం చిరంజీవిలా ఉన్నానంటే ఎందుకుంటారూ
అటున్నది చిరంజీవి ఫొటో- అద్దం ఇటేవుంది
తిప్పిచూసుకోండి


పక్కింటి రాజుగారికి వాళ్ళ అమెరికా అల్లుడు
వాచీ తెచ్చిచ్చాట్ట- యాంటీ మాగ్నెటిక్కట
బండకేసి బాదినా విరగదట
నీటిలో నానేసినా మెత్తబడదట
కంప్యూటర్లో- డేటామాటిక్
షాక్ ప్రూఫు- వాటర్ ప్రూఫు
బ్రెడ్ స్లైజరు కూడా
చూపిస్తుందట
విన్నామండీ- విన్నాం
నిన్ననే ఎవరో
చెక్కేశారట్ట

## బుడుగు


ఇవాళ మీయింటిలో
వంటేం చేశారండీ ?
ఏమోనండీ - మా అమ్మ
కలిపి ముద్దలు నోట్లో
పెట్టేసింది

## బుడుగు


షో - ఇక్కడుం అల్లరి చెయ్యకు
నాన్నదగ్గరకెళ్ళు - అని మాయావిడ అంది
కివస్తే అడుగు...

## బుడుగు

మా నాన్న - పాలవాడికి పాతిక_ అయ్యరివాడికి ముప్ఫై
ఉప్పూ పప్పూ కిరనాకొట్టువాడికి పదిహేను
ఇంటివాడికి పదిహేనూ బాకీ వున్నాడనుకో - అంటే మొత్తం
మా నాన్న ఎంత బాకీ తీర్చాల్సి వుంటుంది?






## బుడుగు





